దున్న తల్లికి కండ్లుచల్లనాయనూ ॥ విధియిట్లాయను ॥ పా ॥ సూర్య చంద్రుల సాక్షిగ యేనేర మెరుగ నాదుకర్మి ట్లాయనూ ॥ యేమిశాయనూ ॥పా॥ వేగగిరిసాక్షిగ యీబాధనొందగ బ్రహ్మ నుదుట వ్రాసెరా ॥ ఆహా యీశ్వరా ॥ పాలలోచన ॥





కందార్థములు.

వంకరకత్తులుచేకోని, లంఖించుక భటులునన్ను ॥ రయమునగొనిపో, వింకేమి చేయువాడను, శంఖించరు వేసుకున్నా ॥ శంకరా॥ హార హారశంభో ॥ శంకరా ॥ కింకరులై యిరువంకలవచ్చిరి । సంకటమెన్నడు సమకూడెనోహర ॥ శంకరా ॥

యీశాపరమేశ్వర, భాసురముగ నేలవయ్య - భవహర నమ్మిన దాసుని మొరనాలింపవు, యోచన నీకేలగాశి ॥ యీశ్వరా ॥ హరహర పరమేశ్వరా ॥ వాసిగనమ్మితి కాశినివాసుడ । దోషమునాయడ లేశ ము లేదు ॥యీశ్వరా॥ హరహర పరమేశ్వరా ॥

వ. ఇట్లు సారంగధరుని దుఃఖంబు జూచి భటులు నూరార్చుచు యిట్లనిరి

గీ. యేల యీదుఃఖంబు ♦ మాను భూపాల
తనయ పూర్వా కృతము ♦ తప్పింపవశమ,

ఘనతనొందుము కన్నీరు • గారనేల
ముదిత చిత్రాంగినీపాల • మృత్యువయ్యె.

వ. ఇత్తెరంగున భటులు సారంగధరుని గొనిపొయ్యెడి తెరంగెల్ల దూతి కలచే వినంబడి రత్నాంగి పుత్రునికొఱకై విలపించుచు అంతఃపురంబు విడిచి రాజేంద్రునికడకు వచ్చె నెట్లన్న.





రత్నాంగికథ.

దరువు, ముఖారి - ఆది.

రత్నాంగి వెడలె రాజసభకు॥ పుత్రునికొఱకై॥ రత్నాంగి వెడలె రాజాసభకు॥ అనుపల్లవి॥ రత్నాంగి వెడలెను రాజేంద్రునికడ । పుత్రుని దునుముట యుక్తముగాదని॥ రత్నాంగి॥ కలికి కన్నుల నీరు జిలుక॥ సుతుపై నీకి॥ అలుకావిడుమాని విభుతో బలుక । యిలగల నోములు గనినోచిన నా । ఫలమెల్లను నిష్ఫలమయ్యె నయ్యారొ నీక॥ ర॥ విడిబాడి వీథి జనులు చూడ॥ రాసతి శిశువు॥ నిడుమాని విభునిచేరి

వేడ। తొడరిపాదములు తడబడ యదరక । మిడిమోగుచు తడబడ యదరక॥ మిడిమోదుచు తనవిభు నటుచార॥ ర॥ ఘోరాదుఃఖంబు నారీజెంది॥ పురవీధులపడి॥ భోరూనేడ్వాగ సాగెకుంది॥ కూరిమి సుతుపై నేరము లెంచియు । వేరుశాయకు వేదాద్రివాసయని॥ రత్నాంగి వెడలె రాజసభకు॥

వ. ఇట్లు రత్నాంగి వెడలివచ్చి భర్తకడజేరి వినయోక్తులచే వేడుకొనె నెట్లనిన.

కందార్థములు.

దండము ప్రాణేశ్వరవర, మండలపతి బాలునిడచి ♦ మన్నించవె నా, దండముచేసికొని శిశువుని, ఖండించకు నొక్కబిడ్డ॥ గదవేప్రాణేశ॥ నేరనిపసి॥ వాడేమిజేశా । మండితశతకోటి మార్తాండతేజ వుద్దండకోపము బూని దండించతగవానె॥ గదవెప్రాణేశ॥

యెన్నగ నోములు నోచియు, చిన్నారిని గంటిమయ్య ♦ శ్రీహరి కృపచే, అన్నియు మరచితివేమో, నిన్ననగను దోషమబ్బు॥ నిజముగ నాథా । కన్నియనీకు గరపెనీబోధ॥ పన్నుగనేరంబు పాలించలేకాను । కన్నపుత్రుని జంపుకున్న దిక్కెవ్వరిక॥ నిజముగనాథ॥

యడబాయక క్షుణ్ణమైనను, తొడపై నిడుకున్నబుద్ధి ♦ దోచక యిపుడుగా, కడనుబ్బుచు కన్నపుత్రుని నడవులపాల్ జేయనెటుల॥ నాథా నీకొప్పె॥ నమ్మకమునా॥ సవతేమిజెప్పె॥ పుడమీశసత్యాత్ముడు భూపాల నీసుతుడు । దుడుకునేరని సద్గుణునెట్లు వధియింప॥ నాథానీకొప్పే । నమ్మకమునా॥ సవతేమిజెప్పె॥

వడినేగి నడవులందున, బడియాకు లారగించి - బ్రతుకుదు మయ యో, యెడలేని దుఃఖమాయెను, పుడమీశ్వర పుత్రదాన॥ మియ్యవే॥ శిశువదలనాజ్ఞ । జెయ్యవే॥ విడిబడినడవులబడి బ్రతుకుదునా । తడయక బాలునిదయతో దానమియ్యవే॥ శిశువదలనాజ్ఞ॥ జెయ్యవే॥

దరువు - శంకరాభరణము - ఆట.

తగునా ప్రాణేశా ॥ లోకులువిన్న ॥ నగరేభూమీశా ॥ అను పల్లవి ॥ తగదుదండనచేయ తనయూని మన్నించు । వగలాడిబోధనీవల గొని శిక్షించ ॥త॥ ఘనబుద్ధిశాలీ । విడువవెముద్దు ॥ తనయునిజోలి ॥ అనుమతించవెబ్రోవ అన్యులెవ్వరుగలరు । ధనము భార్యలుపుత్ర ధన ముతోసరిరారు ॥ త॥ ధరణీతలేశా । వరసారంగ ధరుడేమిజేశా॥ యీరు వంద చిత్రాంగి విపరీతవాక్యములు । స్థిరమాని భావించి శిశువునివధ చాయ ॥త॥ యేలామీబుద్ధి ॥ నీకుసురాజ్య ॥ పాలానకొద్ది ॥ వాలాయ ముగరాజ్యపాలనపుత్రునికి । చాలాగా నొసగేటి సమయామునేడబాప ॥త॥ నరనాథకొడుకూ ॥ జేసేనోలేదో ॥ నేరానిదుడుకూ ॥ పరమసద్గుణ శాలి భరితుడు వేదాద్రి । హరిసాక్షివధియించ కయ్యయొ్యా నొకబిడ్డ తగునా ప్రాణేశా ॥ లోకులువిన్న నగరే ॥

వ. ఇట్లు మొరలిడిన రత్నాంగితో రాజనరేంద్ర భూపాలుండు క్రూర దృష్టిచే నిట్లనియె.

రా-క ఒప్పను వధచాయకనే
తప్పక దండించివిడతు ♦ ధర్మాత్ముండని,
జెప్పగ జెల్లెన ఓచెలి
గొప్పగ జరుగంగకీర్తి ♦ గొనియెదనబలా.

ర - ద్విపద.

నయమొప్ప రత్నాంగి నాథుపాదముల - దయనేలుమని బట్టదన్ని పొమ్మన్న - పతియాశ వదలి పాపడేడనుచు - అతి వేగమునవచ్చి అరి కట్టితనయ - చందమెల్లనుజూచి సుఖమూర్ఛ నొంద - చిందాయె వెంట్రు కలు సిఖయూడి భూమిపై - కాంతకన్నులనీరు కాల్వలై పార - కొంత గుండెలు గుద్దుకొనుచు తాలేచి ఘట్టిగాత్రాళ్ళచే గట్టబడియున్న - పట్టి నెత్తుక ముద్దు బెట్టిశోకించె ॥





రత్నాంగి - పరువు - శోకవిరాళి - జంపె

పుత్రనాగర్భమున బుట్టినందుకు రాజ్య। పట్టాభిషిక్తుడై ప్రబలెదనుకుంటి। పల్లవి ॥ ౧ ॥ యిలయెల్ల ప్రభుడవై యేలుచుండగనాదు। కలనైన వేడుక కనులజూచెదనా ॥ ౨ ॥ యిరువంద భూషణాల్ ధరియించు బాహువులను ॥ కరకుత్రాళ్ళచె విరచికట్టబడె నటరా ॥౩॥ జనన కాలమునందు జాతకముశోధించి। ఘనశాస్త్రవరులెల్ల ఘనుడవుదువనిరి॥ ౪॥ ఆటపాటలుమాని అమ్మరావమ్మనుచు। మాటమాటకు నన్ను మరి బిలచువారెవరు ॥ ౫। పాలు వెన్నను పంచదారతో బెంచిన ॥ బాలప్రాయమునేల పాలాయెనటరా ॥౬॥ పుడమిలో పేదలకు పుట్టినను కీర్తియా ॥ కడుగొడ్డురాలకును గలిగితివికొడకా ॥౭॥ అయ్యయోనాతండ్రి అడవిలోననుదలచి। నెయ్యమున ప్రాణంబె నెటుల విడచెదవో ॥౮॥ ధర వేదశైల శ్రీహరిసాక్షి సారంగ। ధరయసుచు యిఖనెవరి దనయ బిలచెదను ॥పుత్ర ॥౯॥

సంవాదము - నాదనామక్రియ - ఆది.

అన్నానినుయెన్నడు జూతును। కన్నాగొడ్రాలైతి ॥ నాయన్నా చురుపిడనైతి ॥ ౧ ॥

అమ్మాపూర్వము అన్యులబాపితినో॥ అనుభవమాయె నేతల్లీ॥ ఆ॥ అజూడిటువ్రాసెనెతొల్లీ॥ ౨॥

మక్కువచే నినుగనిపెంచుక నాదిక్కనినమ్మితిరన్నా॥ నే॥ నిక్కము నుంటినిరన్నా॥ 3॥

తరుణిరోసంపద తనయులు దేహముస్థిరముగాదనాయమ్మా॥ దీని॥ తెరగుదెల్పెద వినవమ్మా॥ ౪॥

కుసుమలు సరియౌ సుకుమరి దేహము కలసిగందెననాయన్నా ॥దూ॥ ర్థశకేమందురన్నా॥ ౫॥

సురులకైన సుఖదుఃఖములిసువవు నరులవశముఃరాదమ్మా॥ కర్మ సరళినిదియె పోవమ్మా॥ ౬॥

పున్నమచెందురునెన్నగు ఆననచిన్నబోయె నాయన్నా॥ నే॥ కన్న హృదాయెకన్నా॥ ౭॥

ఘట్టిగ నేసీగర్భముసంపుస పుట్టినదెకల్లమ్మా॥ యిపు॥ ఒట్టి॥ జాలి వినవమ్మా॥ ౮॥

దండిగనీ సద్గుణములుదలుచుక సుండజాలరాయన్నా॥ నీ॥ యండ భాయలేరన్నా॥ ౯॥

వేదశైల శ్రీనాథునిసాక్షిగ ఆదరించుటెవరమ్మా॥ యీ॥ బాధ మాన్పలేరమ్మా॥ ౧౦॥

కందార్థములు - సంవాదము.

కులపావనపుత్ర నీవు, గలిగిన సంతోషమంది ♦ గలకాలము భూతనమెల్లను ప్రభువై, పాలనలేకానుఅడవి॥ పాలైతివటరా॥ దైవము నీకీ॥ మేలెంచనటరా॥ బాలానన్నెన్నడు ♦ బాసిపోవనివాడ లోలాక్షీ కడకేగ ♦ గోలనీపిటునిందె॥ పాలైతివటరా ♦ దైవమునీకీ మేలెంచె నటరా॥

విధికృతమీలాగున, విధియింపగ హరులకైన♦ విడచుటగలదా యెదిరించవెంతవారము, మదవతిశోకంబునీవు । మానవేమమ్మా రమ

ణమునొంద వ్రాసెనే బ్రహ్మ॥ వదలాకననుగన్న వాంచనేనిటుదుఃఖ మది యెల్ల మృతిబొంది మరలినేఁబచ్చేన ॥ మానవేమమ్మా॥ మరణమునొంద వ్రాసెనె బ్రహ్మ॥

కందార్థములు = సంవాదము.

చెలికాండ్లగూడినెప్పుడు, వలనొప్పగ ఆటలాడి ♦ వచ్చెటివేళల్, ఫలభక్షములారగిమ్మని, బిలతునుయిఖ ♦ రమ్మనెవరి॥ బిలచేదకొడకా॥ కంటిరనోచి॥ కనరునేవిడక॥ తలచియెార్వగలేరా తనయనీసద్గుణము॥ పలుమారు కొనియాడి ♦ పట్టిరమ్మని యెవరి। బిలచదకొడక। కంటిరనోచి॥ కనరునేవిడక॥

ధరనెంత కర్మమొందితో, నెరుగని అన్యాయ మొకటి♦నేడుఫలించెన్, నెరయోధులెల్ల జగతిని,స్థిర కాలమునుండలేరు॥ స్థిరమాటసుతులూ పొందుటకెవరో। సుతులాచెగతులు॥ విరిబోణి దుఃఖంబులువిడిచి నాచెలికాండ్ల॥ మరిబ్రోవునాలాగె మదవాతి పోయివత్తు॥ స్థిరమాటసుతులు॥ పొందుటకెవరో సుతులాచెగతులు॥

వ. ఇవ్విధంబునబలుక మేరలేని దుఃఖసాగరముచే విడ్డను కౌగిలించుకుని రత్నాంగి విలపింపదొడంగె.

దరువు, సంవాదము = శుద్ధసావేరి - ఆట.

నాతనయ ననువిడచిపోతావా । నీవు । ననుజూడ మరలిరా బొయ్యేవా॥ అనుపల్లవి॥ యేతంత్ర మెరుగాక యీతీరునైతివి। పాతాకి చిత్రాంగి పాలమృత్యువృకొడుక॥ నా॥ తల్లియీవల ఘోషమేలనే। నీ। వల్లాభు కరుణెట్టులాయెనే యెల్లనాచెలికాండ్ల చల్లానికృపనేలు । పల్లావపాణీనే వెళ్ళివచ్చెదపొమ్ము॥ త॥ నోమునయిన్నాళ్ళుపెంచితి। యెంత॥ నోమునోచదవీకిబంచితి॥ భూమిలోనాసాటి పుత్రులగనిపెంచు। భామాలలో దుఃఖ భామూలు బడవ్రాసె॥ నాత॥ హరిమాయ దెలియానుతరమాటే॥ నా॥ దురితాము లొనగూడక విడునాటె॥ యిరువంద పినతల్లియానిందె వడిగట్టె ధర వేదశైల శ్రీహరిసాక్షి నొకటెరుగ॥ త॥

# చిత్రాంగి నాటకము

సంధి ॥గీ॥ అనిసుతుడు జననితో ♦ అంగలార్పగను
గనిభటులు జామాయ ♦ గదులు సారంగ
ధరయనుచు బలుక ♦ దల్లి చిత్రాంగి
యొలుగెత్తిఘోరన ♦ యేడ్వసాగె.

వ. ఇట్లు ప్రలాపించుచున్న చిత్రాంగిదేవితో చెలికత్తెయ లిట్లనిరి.

చె॥ గీ॥ వినవె చిత్రాంగి బిడ్డను ♦ విడిచిలెమ్ము
వచ్చుచుండగ రావమ్మ ♦ రాజస్త్రీలు,
పుత్రు డల్పాయువై పుట్టి ♦ సందుకుదైవ
మెడబాపె దుఃఖింప ♦ వెర్రులుంగలరె.

వ. ఇట్లు నూరార్చి చెలికత్తెయ లిరువంకలం జేరి బలవంతంబున గొని పోయి చిత్రాంగి నిలయంబునం జేర్చ పుత్ర మరుపిడలేక బొగలు చునుండె ॥ నంత సారంగధరుండ ప్రియమిత్రులం గనుగొని విలపింప దొడంగె॥

సా - ద్విపద,

పురమందుగల మిత్ర బృందంబులార - శరణయ్యె మనకు బుణ శేషంబుచీరె - శలవొసగిబాపరె సఖులారనన్ను - సిలుపనిక రెచ్చోటు నీతలవర్లు - గొనిపోయియీప్రొద్దు ఘోరవిపినమున - నను కాళ్లు చేతులున రుకబొయ్యెదరు - పోవలెవిధిచెప్ప పోయిమీరెల్ల - నావలె కష్టంబు ననుభవింపకను - జనని జనకులమాట జవదాటబోకు - మనహితు లకలహించి మారాడరాదు - మునియతుల పూజించి ముదమొప్ప వారి - చనువొందిమహాత్మ సాంగత్యమిడచి - పరధనము పరస్త్రీల పాటించబోకు - నిరతంబుసద్భక్తి నొందిమీరెల్ల - సత్యంబు దప్పకుడు సర్వేశుసాక్షి - ప్రత్యేకనరకంబు ప్రాప్తించుయిలను - గలపేదజన ములకష్టించకెపుడు - చలగుచుండుడి తనువు శాశ్వతముగాదు - మన తాతముత్తాత మరిపువారెల్ల - వెనుకటివారంత యేమైరొమాకు - ధర్మమేనిక్కంబు ధరణిలోపుణ్యు - నిర్మలమతులార నే జప్పనేల - బా

లులారమనము బంతులుగైకొని - చాలఆడినఆట సమసెనిప్పటికి - కర మున కేజాలుగైకొని మనము - పురవీధి నాడుచు పోదుమెల్లపుడు - వనములో వికముల వదలకపట్టి - మనముముద్దాడినది మరచి పోయ్యోదర- కొలను లోపుల జూచి కొంతనచోటి - జలక్రీడలాడియు జనుదెంతు మెప్పుడు - యిఖమీదఆన్యోన్య విధములగాను - అకలంకమతితోడ ఆడ బోయ్యోదమా - యేడిసారంగధరు డేడిరాడాయని - వాడలోనాకెదురు వత్తురాయికను - నేపోదుశలవిమ్ము నా యన్నలార - యీప్రొద్దుమీరెల్ల విడువలకేగి - ననుదలచిదుఃఖంబు నందెదరేమో - మనసఖులు బంధువులు మన వారికెల్ల - వందనము భూసుర వరులకందరికి - నిందెలపాలైతి నిలవుందునేను - కవలి పోయ్యెదనయ్య గహనభూములకు - ముదిత చిత్రాంగి నాపాల మృత్యువయ్యె.

కం. గీ. అర్ధరాత్రి వేళ - ఆరాజసుతుని
మర్ధింపదలపెట్టి • మహాశూరులంత,
కదలిరచోటు దండకా • రడవికేగి
యములంటి నొకపెద్ద • బండపైద్రోచి.

దండనాయకులు.

సీ. ఘనులార రాజాజ్ఞ - గైకొని ఛేదింప, గొనివచ్చితిమినయ్యో -
గోలనిటకు । దానధర్మంబులు - దగసల్పు హస్తముల, గోయ
నామనసుకు - గోపడాయె । చిగురుటాకులవంటి - చిన్న పా
దంబుదు, తెగవ్రేయబుద్ధికి - తెంపురాదె । పట్టభద్రునిబోలు -
బాలచంద్రునిబట్టి, ఘట్టిగాఛేదింపగా - జాలనైతి ॥ వీని సంపద్గు
ణంబులు - వీనిసుగుణ వీని రసవచన మృదుపల్కు - లిన్న
కన్న । జాలుపరులకైన - జాపుటెట్లు । చేతులాడవు విధికేమి -
జేతుమహాహా ॥

వ. ఇట్లు చింతిల్లెడి దండనాయకులగాంచి సారంగధరుండు యిట్లనియె.

సా-సీ. దండనాయకులార - దయమాని మాతండ్రి, ఖండించి రమ్మనె
కనరు లేక । కేల యీచింత - మేదినీశ్వరు డాజ్ఞ, చేకొన్న
చింతేల - ఛేదించిపోరె । నేకులద్రోహుండ - నేమహాకష్టుండ
గాకున్న నరకంబు - గలదెవాకు । అకటనేనొకటెరుగ - అన్యాయ
మొనగూడె, యికతలపతగవౌన - యీశ్వరాజ్ఞ । అనిచిత్త
మేకాగ్ర-మపుడుగావించి । ఘనకోర్కెనెల్లను - గడిగ... ।
హరిమంత్రధ్యానంబు - అవ...ంగనిల్పి । మరుమాటలేకను
మహిపైకి నొరగె॥

వ. ఇవ్విధంబున సారంగధరుండు నిరింద్రుడయి బండపై బరుండ ...
కొంతతడవు చింతిల్లి రాజాజ్ఞ మీరుట ప్రమాదంబని యెంచి ...
ధైర్యం బవలంబించి కోపోద్దీపితులై.







దం. క. వదలించి పాదినికత్తులు
మదినుగ్రము నొందిభటులు ♦ మార్కొనిబాలుఁ,

గుదిబట్టి కాళ్ళు చేతులు
పదిలంబుగ గోసిబండ ♦ ప్రక్కకు జరుగన్.

వ. సారంగధరుని హస్తపాదంబులు ఖండించిన రక్తప్రవాహంబులుం జూచి దండనాయకులు భీతిల్లి తత్తరపాటున వృక్షమున మరుగున దాగియుండి రంత.

గీ. మొండెపై రక్తాన ♦ మునిగితేలుచును
బండపై మూర్ఛిల్లి ♦ బడి లేవలేక,
గడగడవణకుచు ♦ కన్నులు వెరచి
నలుదిక్కు లీక్షించి ♦ నరపాలసుతుడు.

దరువు - శోకవరాళి - జంపె.

భటులార నేడు యీబాధ కోర్వగలేను । తటకునను కంఠంబు తప్పించిపోరే॥ పల్లవి॥ ౧॥ హరివ్యాఘ్రభల్లూక అమితఘోంకారభీ । కర మృగంబులు నన్ను కబళింపరారే॥ అ॥ బ్రహ్మరాక్షస భూత భేతాళ గుములార । రమ్ము నను భక్షింపరారె మీరైన॥ ౩॥ కోపమున యీపట్లు గొనినన్ను భక్షింప । దాపుబాంధవులనుచు దలచెదనుమిమ్మూ॥ ౪॥ తాళలేనీబాధ దరనిల్వతరమ అ । కాలమృత్యువ నన్నుకనవేనీవైన॥ ౫॥ భువిసత్యవ్రతుడని బుధులెల్ల కొనియాడ । దైవమానానీతి ధరణిపాలాయె॥ ౬॥ అష్టదిక్పతులార హరిబ్రహ్మ సురులార । కష్టమును దొలగించి కావరేమీరు॥ ౭॥ చెన్నుమీరగ వేదశైల శ్రీలక్ష్మీశ అన్యు లెవ్వరు నన్ను ఆదరించెదరు॥ ౮॥

సా-గీ. పుడమి రేడుల యిండ్ల - బుట్టనే అపకీర్తి
బడనైతి పినతల్లి - బగదీరనేడు,
అనిఘోరు నేడ్వంగ - అంతరిక్షమున
వానితో నాకాశ - వాణి యిట్లనియెను.

ఆ - వచనము.

ఇట్లు సారంగధరుండు బాధల నొందుచు పలువిధ తలంపులచే దుఃఖింపుచున్న సమయంబున అంతరిక్షమునుండి గగనవాణి మహా ధ్వనిపదంబుచే ఆహా ఓయి సత్యసంచారుం డగు సారంగధరుడా యేల దుఃఖించెదవు వినుము నామాట పూర్వజన్మంబున శాంభవీ పురంబేలు ధవళ చంద్రుండను రాజునకు సుమంతుండను జయంతుండను మంత్రు లిరువురుం గలరు. వారిలో పెద్దవాడగు సుమంతుండను మంత్రిని మెచ్చి రాజింత నధికారం బిచ్చి పోషించుచుండెనవిజూచి యోర్వజాలక రెండవ మంత్రియగు జయంతుండు సుమంతుని వంచింపదలపెట్టి నగరుయొక్క బానిసె కత్తియగు దానికి కావలయు ధనం బిచ్చి సుమంతుని పావుకటు యెవరికి దెలియరాకుండ రాజేంద్రుని పడకటింటిలో రాణియగు భువన సుందరి మంచంబుక్రింద నుంచిరమ్మన్న నామాంయలాడి ద్రవ్యమునకు ఆపే క్షించి పడకశృంగారించెడి యడ నాసుమంతుని పావుకలు భువనసుందరి మంచంబు క్రింద నుంచె, నాటిరాత్రి ధవళ చంద్రుండు పడకటిల్లుచేరి భార్యా సమేతంబుగ సరస సల్లాపంబు లాడుచు విడిమెళ్ళ గాయుటకై మంచంబుక్రిందికి నొంగెనంత పావుకలను వీక్షించి ఓ బాలిక యీ పావు కలు యెవరివటన్న భువనసుందరి భీతిల్లి యేమియుం జెప్పజాలక నూర కుండె నంత, తెల్లవార ధవళ చంద్రుడాగ్రుడై కొలువు కూటంబునకేగి పరిచారకుల బిలిపించి నగరులో భువనసుందరి మంచంబు క్రింద నుండు పావుకలు గొనిరండనిన వారతివేగ గొనివచ్చి సభవారి యెదుట నుంచె, నది జూచి యీ పావుకలు యవరివటన్న పెద్దమంత్రియగు సుమంతుని పావుకలుగాని యెుండొరులవిగావని సభవారు పలికిన అంత రాజేంద్రుండు నిజార్థంబు దెలియక సుమంతుండు రాణివాస ద్రోహుండని యెంచి నడిరేయి ఝామున నడవికి గొనిపోయి కాళ్లుచేతులు ఖండిం చుండని ఆజ్ఞయొసంగె. తదేవత్తున భటులు సుమంతుని సుహారణ్యం బునకుం గొనిపోయి హస్తపాదంబులు ఖండింప విలవిలదన్నుక ప్రాణంబు

విడుచు సమయంబున నన్నిటుల పరితపింపజేసిన క్రూరుండు నావలెనే మరుజన్మంబున కష్టించునని జీవంబువిడచె గావున యీ జన్మమందు సుమంతుండను మంత్రి మీతండ్రియై పుట్టె. భువనసుందరి మీతల్లి యగు రత్నాంగి యయ్యె. బానిసె కత్తెయగు దాసి చిత్రాంగియై పుట్టె. నీవు జయంతుండనె చిన్న మంత్రివిగాన తొల్లిటి కర్మంబు సానుకూలంబాయె యిఖముందు మేలు సేకూర్చునని పలికి చింత విడిపించి నిశ్శబ్దమందె నంత.

వ. ఇవ్విధంబున ఆ కాశవాణి సారంగధరున కెరింగించిన పలుకులు న్ను మరుగున పొంచియున్న తలవర్లు ఆలకించి మహాశ్చర్యంబు నొంది,

క. అటుగోసిన కాళ్ళు చేతులు
తటకునగొని రాజభటులు - తహతహపడుచున్,
కుటిలాత్మురాలు బన్నిన
మటుమాయలు దెలుపనరిగె - మహిపతికడకున్.

గీ. సారంగ ధరుడంత - చలుపుతీపులకు
యోర్వజాలక దేవ యోమాతయనుచు,
అడవిలో ఘోషింప - అంధకారమున
బాలుని ఘోరంబు - బారెదిక్కులకు.

మీ న నా ధు ని క థ.

ద్వి ప ద.

ఆమీనసనాధుండు అమిత శివయోగి - కామితార్థములేక గడగి
శేషాఖ్య - పర్వత బిలములోపల యోగపూజ - సర్వేంద్రియము
లొగ్గి చాలించి పిదప - పవళింప నరఘోష వడుచున్న విధము -
చెవినాటసిద్ధుండు చచ్చర లేచి - భూతి దేహమునిండ బూసి జపమాల -
చేతబూనుక జడలు చట్లమిట్లాడ - దండకమండలము దనరురుద్రాక్ష -
మెండుగ యురమున మెరయ పాదుకలు - ధరియించి క్రిష్ణాజినము
జంకనిడుక । నరుదెంచె మునివరుడు నమశ్శివాయ యనుచు॥

మునిదరువు, జంఝుటి - అట.

శరణా శంభో శివ శశిధరమహాదేవ । సురవర కరుణించరా॥
అనుపల్లవి॥ గంగాజటాధరాగౌరివల్లభమహా । లింగవేదెదరారా॥ శ॥
శూలపాణిధర !సుందారా వృషభేశ । పాలాక్షపరమేశ్వరా॥ శ॥ కరి
చర్మాంబర ధల నీలకంఠ పన్నగభూష । మొరలిడితిగిరిజేశ్వ! శ॥ భక్త
వత్సలకోటిభానుప్రకాశ శ్రీ॥ ముక్తినాయక మ్రొక్కెరా॥ శరణా॥
వేదాద్రివాసూని సోదరియగుగౌరి । నాధనన్నెగబ్రోవరా॥ శరణు॥

ము-క. మునినాథుం డావేళను
వనమధ్యను రక్తధార - నచ్చోటఁజూడన్,
గనిచేర బోయిబాలుని
అనఘాత్ముఁను నిట్టులనియె - ఆశ్చర్యమున్.

మునిదరువు, నాదనామక్రియ - ఆట.

ఓరోరిబాల నీ వీ ఘోరమునుజెంద నేరంబు నీయందు లేమీ ।
చోరులుక్రూరులై సొమ్ములను గొనిపోవ యీరీతి చెందిరాయేమి॥
అనుపల్లవి॥ పసిబాల నిన్నుయీ నిసిరేఘామువేళలో కసిదీర కాల్చేయిక్ర
గోయా । మోసమునఁదగవారు యోచించి నిన్నిట్లు జేసిరా నాకేలడాయ॥
ఓరోరిబాల॥ యేపురము కాపురము యెంతదూరపుసీమ యేజాతి
వాడవునీవూ । ఓపాప నిటుజాయ యేపాపులకుజెల్లు । దాపకుర
నాతోటినీవు॥ ఓరోరి॥ బాలనీతలిదండ్రి బంధుమిత్రులెవరు బాసిరా
గారణంబేమి । యేలనిందిఖంచెదవు వేదగిరినరహరి । పాలనహకుడైనసామి॥
ఓరోరి॥

వ. ఇట్లు బలికిన మునిశ్రేష్ఠునకు రాజకుమారుండు యిట్లనియె.

సా-క. నడిరేయి ఝామునందున
నడవికి నే తెంచిమీరు ♦ నాస్థితినడుగన్,

కడుభీతి కలిగి యెప్పుడి
దడయక చరియించుభూత ♦ దైత్యుడవయ్యా.

మా-గీ. నరభూత పిశాచ ♦ దైత్యుండగాను
నపరాధసిద్ధులకు ♦ న్యాయమేటి
మానవనాథుండ నామంబు ♦ మెగడువాడ
తపమిడచివిపినంబు ♦ తగచరింతు.

క. వెరవేల ఓరిబాలక
పరమేశ్వరు పూజసల్పి ♦ పవళించుకొడక,
నరఘోష పిక్కటిల్లిన
పరికింపగ వస్తినిటకు ♦ బహుదయతోడన్.

వ. ఇట్లానతిచ్చి నీసవిస్తారము వినిపింపుమన్న రాజకుమారుం డిట్లనియె.

సా - ద్విపద.

మునినాథ వినవయ్య వినోదంబుతోడ - మనవిచేకొని నన్ను మన్నించవయ్య - యిలచంద్ర వంశంబు వినుము నాతండ్రి - నలువొప్ప రాజనరేంద్రుడిల్లాలు - రత్నాంగిమాతల్లి రమణికిచవితి - చిత్రాంగి యనవొప్పు సుదతిపినతల్లి - ధరలోన సారంగధరుడు నాపేరు - ధర పాలకుడు నిన్న దరితెల్లవార - వేటాడ అడవికి వెడలెమాతండ్రి - నాటి దినమెపావురం బాటాడదలచి - జెగరింప వడినేగి వెలదిచిత్రాంగి - నగరంబు చేరగ నటుబోయి మ్రొక్క - అమ్మ నా పక్షిని తెమ్మన్న వినక - కొమ్మనాతోపొందు గోరి పెంపెక్క - గతితల్లి యిదినీతిగా దన్ననలగి - జననాథు వేటాడి జనుదేర పిదప - భూపాలు కెరిగించి పాలతికపటములు - బాపురే నన్నడవిపాలు గావించె - అయ్యరో వారింత అడుగంగనేల - మియోగ్యదృష్టిచె మాకెరుకగాదె - పర మేశుభక్తులు పరిహింసనెప్పుడు - పరికించనేరాదు పరికించితీరి - వినునాదుకష్టంబు లీగేర్చిపోవ - మునినాథమారె నాముఖ్యబాంధవులు,

సా-క. తనువదలి పోదుజీవము
మునుజేసిన ఖర్మమేమో ♦ మునికులచంద్రా,
ఘనవిధ మిచ్చినపుణ్యాం
బోనగూడును బాధకోర్వ ♦ నోమహాదేవా.

వ. ఇట్లు పలువిధంబుల ప్రలాపింపుచున్న సారంగధరుని నిజాభిప్రాయంబు తన యోగమహాత్మ్యంబుచే నెరింగి కరుణాంతరంగుడై నమ్ముని శ్రేష్ఠం డిట్లనియె.





ము-గీ. ధరలోన సారంగ ♦ ధరుడనిత్యంబు
గనుగొంటి నాతపో ♦ గననిష్టచేత,
భయపడకు పూర్వబా ♦ లునిగాగ జేసి
జయము నొందింతు ♦ నీకీర్తి జగతిలోన.

వ. ఇత్తెరంగున నూరార్చి సారంగధరుని నిర్మలకొల జలస్నాన మమర్చి తనగుహాకర్ణ గొనిపోయి మంత్రజలంబు ప్రోక్షించుచు ధైర్యము అవలంబింప జేయుచు గోక్షీరంబునం బోషించుచుండెనంత.

దం.వ. రాజాజ్ఞ ప్రకారంబున ఖండించిన హస్తపాదంబులు దండనాయకులు గొని పురమునకువచ్చి నిట్లనిన.

క. తరిగిన పాదంబులు

పురపతి కొప్పించవెడలె । పూర్వపుదిశలన్,
దరి తెల్లవారె భానుం
డరుదెంచక మునుపెవచ్చి । అప్పురిజేరన్.
రాజు-క. నిదురబ్బక నాటిరాత్రిరి
మదినిల్వక పుత్రశోక । మగ్నుండైతా,
నెదురేగి భటుల గనుగొని
విధికృత మెంతెంతజేసె । యీశ్వరయనుచున్.

వ. ఖండింపబోయిన దండనాయకుల జూచి గుండెలొక్కలై మండలేంద్రుండు దండి దుఃఖమున నిరింద్రుండై యుండ గన్గొని తలవర్లు యిట్లనిరి.

భటులు-దరువు, నాటరాగం-ఆటతాళం.

దండమిదె భూమండలేశ్వర ఖండనాయక బ్రోవవయ్యా॥ దండమూ । వయి నేలుచుండుమూ ॥ అనుపల్లవి ॥ చండతర మార్తాండుపగి దుద్దండముగ ఖండించినుతునీ వ్వసిమీ ॥ గురుతులు తెస్తిమీ ॥ దం॥ కరముకాళ్లను దురిమితరువెల మరుగునను మరికొంతపొంచి యుంటిమీ॥ వింతలు వింటిమీ ॥ దం ॥ తల్లడింపుచు తనయుదేడ్చెను కొల్ల కొల్లగ రక్తధారలు పారగా ॥ విధీనిటు దూరెగా ॥ దం ॥ మునుల సురులను దలచిమరిమరి మునిగితేలుచు రక్తమందు యుండెగా ॥బాధలు మెండుగా ॥దం॥ ఆలకించి గగనవాణి బాలకాయిది పూర్వకర్మని జెప్పగా ॥వింటిమి॥ ఒప్పగా ॥దం॥ అంతరిక్షమునుండి వాణి వింతగా సుతుసత్యమేర్పడ జెప్పెనూ ॥ మామది కొప్పెనూ ॥ దం ॥ యెరుగదెల్పెద సత్యధరుడని వేదగిరి నరహరిని సాక్షిగ భూవరా మమ్మేగబ్రోవరా॥

వ. ఇవ్విధంబున ఆకాశవాణి పలికిన పలుకులున్ను సారంగధరు ఘోరంబంతయు విన్నవించి హస్తపాదంబులు రాజేంద్రుని యెదుట నుంచిన జూచి.

గీ. పచ్చిరక్తముగారు ♦ పాదహస్తములు
దెచ్చి భూపతికెదుట ♦ మెచ్చనిడిన,
జూచి ధరపైని బడిమూర్ఛ ♦ జెందిలేచి
ఘుప్పుఘుప్పున రొమ్ము గుద్దుకొనుచుండఁగ.

వ. ఇట్లు మేరలేని దుఃఖసాగరమున యీదులాడుచు చిత్రాంగిని రావించి రాజేంద్రుం డిట్లనియె.

ద్విపద.

భళిరెభళిరె చిత్రాంగి భామినీనేర్పు - యిలగానలేకనె నెలమోస పోతి - కులపావనుండయిన కొడుకు నట్టడవిలో - బొలిబెట్ట జేసితివి బొంకించినన్ను - ఖరపాదములు భటులు ఖండించినపుడు - బొరలి రక్తములోన భోరునేడ్వంగ - అంతరిక్షమునుండి ఆ గగనవాణి - వింతగా నీతప్పు లేర్పడగజెప్ప - ననిభటులు సభలోన నందరువినగ - వినిపించి రింతిరో వినువ నిన్నికను - సుతుని మోహించి యీ గతి జేసినట్టి - నతిజాడ నరకంబు సంభవించు - కలికి నీ తప్పొప్పు క్రమముగానాకు - దెలుపకుండిన యిపుడు దెగవైతు నిన్ను.

వ. ఇట్లు రాజేంద్రుండు ఆగ్రహంబున ఖండిత వాక్యంబులాడ చిత్రాంగి యిట్లనియె.

చి-సీ. ప్రాణేశనీభార్య - పగబూనినామీఁద, తలవర్లకు గొప్ప - ద్రవ్యమొసగి। పుత్రునిరావించి పుడమిలో నొకపేద. శిశువు కాళ్ చెయికోసి - జేర్పెనిటకు। రత్నాంగితలవర్లు రావించిమీతోడ. చత్రవార్తనువాణి - జెప్పినట్లు। పలికింపజేసె మీభార్యమహిమే గాని, ధరణిసాక్షిగనాదు - తప్పులేదు। అడవినందునబలుకు - ఆకాశవాణి। పుడమీశయిచ్చట-పలుకంగరాదా। మనుజనాయక భటుల మర్మంబునమ్మి। నన్నుపోనాడ ధర్మమా - నాథనీకు.

చిత్రాంగి - దరువు, నాదనామక్రియ - అట.

మానవేంద్రా॥ మనవినిబ్రోవు॥ మానవేంద్రా॥ అనుపల్లవి॥
మానవేంద్ర యిలవాణిపలుకును । కానము యెచ్చట కలియుగమందు॥
మా॥ మచ్చరబోధలు మరినాచవతియు కుచ్చితములను చచ్చరవినకు॥
మా॥ తప్పులు నాపై తలవర్లూహాచే । జప్పుగ నీమది కొప్పెనుయట్లు॥
మా॥ హరిహరబ్రహ్మ సురవరు సాక్షిగ । ధరణీవల్లభా తప్పే మెరుగ॥
మా॥ నాదువచనములు నమ్మవెనిక్కము । వేదశైల శ్రీనాధుని సాక్షిగ॥
మానవేంద్రా॥ మనవినిబ్రోవు॥ మా॥

చి-గీ. ప్రాణనాధనకు ♦ పగదానసైతి
గానయిచ్చట లేద ♦ గగనవాణి,
నిజమురాలైన సభలోన ♦ నిలచియాపె
బలుకరాదా తప్పు ♦ బయలుపడగ.

వ. ఇవ్విధంబున సభయందు నిలబలుకుచున్న చిత్రాంగి పలుకులకు సహింప జాలక ఆకాశవాణి గొప్ప ధ్వనిపదంబున యిట్లనియె.



ఆకాశవాణి-దరువు, రేగుప్తి అటతాళము.

అవునేచిత్రాంగి ॥ అంటివిమాట ॥ అవునేచిత్రాంగి॥ అనుపల్లవి ॥ అవునేచిత్రాంగి నీ అవుసత్య మేమందు॥ భువిలోన-నీవంటి పొలతినెచ్చట గాన ॥ అ ॥ నిన్నాటివేళా॥ పల్లటిలాడు ॥ చున్నాయాబాలా ॥ వన్నె పావురమెగసి కన్నె నీమేడపై । నున్నపట్టుగదాచి యెన్నిబాసలుజేశే॥ వౌనెచిత్రాంగి ॥ తల్లినీవనుచూ । సారంగధరుడు । పల్లాటిమ్మనుచు ॥ వుల్లాబ్జనేత్రి నీ యిల్లుజేరినమంచి । వల్లాయెనని సుతుని వలచిబొంకులు బొంకే ॥ అ ॥ ఆమాటవినకా । వారడగిన । వామాక్షీ వెనుకా ॥ భూమీశునకుయెన్ని బొంకులెల్లనుగరిపి । ధీమసంబు వాని తెగటార్ప జేసితివి ॥ అవునె ॥ తగునయీమాట ॥ నిలబలికేవు । వగలాడిచ్చోట ॥ ఖగవాహనుడులక్ష్మీ ఘనుడు శ్రీవేదాద్రి । నిగమవేద్యునికెదుట తెగు వాచె నిటుబలికె ॥వౌ॥ ంటివిమాట ॥ అవునే ॥

ఆ-గీ. యేదేశుభు ... వెతకియెచ్చోట
చూడబోనియ్యంత ♦ ఆడుదాని
ఓసినీతప్పు గప్పెదల్ ♦ ఒత్తిమ్రొగెదవు
అనిపలికిసిశ్శబ్ద ♦ మందెవాణి.

వ. ఇత్తెరంగున బలుకు ఆకాశవాణి పలుకులు సభవారు ఆలకించి మహా శ్చర్యంబునొంది రాజనరేంద్రభూపాలుండు కోపోద్దీపితుండై తలవర్ల రావించి యిట్లనియె.

రాజు.

సీ. జనపాలుడాగ్రుడై ♦ తనబంట్లగనుగొని, వనిత చిత్రాంగిని ♦ వదల కీపుడు । మనవియేలనులెస్స ♦ మర్ధించిశీఘ్రమె, గొనిపురవీధులు♦గొ దువలేక । ద్రిప్పికత్తులనరకి ♦ యుప్పుపాతరలోన, గప్పిరండికదీని ♦ గానకుండ । యీపాపియాకార । మేపారజూచిన, కూపంబుసిద్ధింప♦ కొదువలేక ॥ గానిత్రాళ్ళ చెవిరచి ♦ గట్టుశుమీరు । కొట్టనెట్టుచుపుర

మెళ్ళ ♦ రట్టుపరచి । దయలేకశరములు ♦ దరిగిరండికను ॥మరుమాటలేక ముమ్మాటికిది శెలవు.

క. ఖండిత వాక్యములాడిన
మండలపతి భృత్యవర్గ ♦ మంత్రులయెదుటన్,
మెండొడ్డి భటులు గ్రక్కున
చెండించను త్రాళ్ళబిగియ ♦ చెలినటుగట్టెన్.

వ. ఇట్లు రాజసభయందు బంధించిన చిత్రాంగిని పురవీధుల వెంబడి కొట్టి తిట్టుచు భటులు అట్టహాసమున దట్టించి పట్టణమెల్ల నెట్టుచు యిట్లనిరి,

భటులు-దరువు, శంకరాభరణము-ఆట.

రావేపోవ ॥ రమణిచిత్రాంగి ॥ రావేపోవ॥ అనుపల్లవి॥ పాపకార్యముచేయ నేలను చావు నిక్కంబాయెనీకు ॥ రా ॥ ద్రోహురాలా ॥ దొరబిడ్డనేల ॥ద్రోహు॥ సాహసంబున సత్యధరుని చంపజేసిన రంకెలాడి ॥ రా ॥ నీదుమాట ॥ నిజమానిపూట ॥ నీదు ॥ సాధుడగు సారంగధరుని పాదబాహులుఖండనాయెను । రావేపోవ ॥ పాపకారి ॥ పట్టినికోరి ॥ పాపకారి॥ యేపురేగి పొందదలచితి వేదగిరి నరహరినిసాక్షి । రావేపోవ ॥ రమణీచిత్రాంగి॥

గీ. వీరవీధులెంబడి ♦ పోలతిచిత్రాంగి
జరజరయీడ్చుక ♦ జనిపోయికత్తుల,
కండతుండలుగ ♦ గావించిభటులు
వుప్పుపాతరయందు ♦ గప్పరావేల.

వ. ఇత్తెరంగున చిత్రాంగిని మృతంబొనర్చి భటులు రాజేంద్రునికి విన్నవించిన పుత్రశోకంబున విలపింపదొడంగె.

రాజు - ద్విపద.

ఓ పుత్రరత్నమా ఓ కులదీపమా ♦ యిాపట్ల నినుబాసి యిఖనెట్టులన్సైతు ♦ నీసత్యసుగుణంబు నీమృదుపలుకులు ♦ నీసొంపునగుమోము

## చిత్రాంగినాటకము.

కావాలుకాంతి ♦ కనుగొనుదు . నాకొడుక కలనైననిన్నూ ♦ తనయ నీ కపెట్లు దరిఁ కొల్పుదునుర ♦ నేజల్ల మూర్ఖుడై నెలతమాటలకు ♦ నిజమని చేజేత నినుజంపుకుంటి ♦ పుత్ర నీపాలికి భూలోకమందు ♦ శత్రుడై తినిగాని జనకుండగాను ♦ నడవిలో కాల్చెయ్యి నరుకుసమయమున ♦ పడరాని బాధలు పడుచునేమంటివో ♦ సత్యసద్గుణశాలి సారంగధరుడ ♦ శత్రుల పాల్జేయగంటినానిన్ను ♦ ధరనుకాల్ బొందదు దనయనీతలపు ♦ మరచియుండుదమంటె మరిలేరుసుతులు.

రాజు - కందార్థములు.

రొక్కడిచావిదిమాయగ, చక్కనినాతండ్రి నీకు సమకూడెనురా, ొక్కడెకొడుకనినమ్మిన, దక్కించకదైవమిట్లు ♦ ధరపాలుజేసే॥ అపుత్రుడై యుండుమాని॥ అజుడిట్టువ్రాసె॥ నిక్కముగనమ్మితి నీవెరాజ్యముకెల్లా ొక్కానియుంటిరా అక్కటదైవము । ధరపాలుజేసే॥ అపుత్రుడై యుండమాని॥ అజుడిట్టువ్రాసె॥

పుడమిని చిడిముడిబడి, అడవుల నదులందు తీర్థమాడియు వ్రత ములల్, కడుతపము జేసిబడసిన, కొడుకునుగోల్పోతిరాజ్య॥ పదవినాకేలా॥ హాతమైతివటరా॥ అయోగ్యగుణశీలా॥ తడయాక నేఘోర తపమాచరించి యూ, బడసినపుత్రుని బాసితినిరాజ్య॥పదవినాకేల॥ హాతమైతివటగ॥ అయోగ్యగుణశీలా॥

గీ. పుత్రునిగుణములు ♦ బుద్ధినూహించి
ధాత్రిపైమూర్ఛిల్లె ♦ దనస్మృతిదప్పి,
కనుగొనిచిత్రాంగి ♦ కన్నీరుజిలుకుచు
గోడుజెంది రిరువురు ♦ గొడుకుమోహమున.

వ. ఇట్లు దంపతు లిరువురున్ను మితిమీరినదుఃఖమున విలపించుచు తల వర్లగనుంగొని పుత్రుడుగతించిన చోటుజూపుమని బంధుమిత్ర వర్గం బులతో గదలి రాక్షణంబున,

గీ. నరనాథుఁడోట్కోని ♦ నంతతలవర్లు
గొనిపోయి కాల్చెయ్య ♦ గోసినతావు,
గనిపించరక్తంబు ♦ గాల్వలై యున్న
వీక్షించిహాయని ♦ నిలపైకినొరగె.

వ. ఇట్లు దంపతులిరువురున్ను మూర్ఛాక్రాంతులై లేచి వృణి లతాదిక పక్షిమృగంబుల గనుంగొని పుత్రుని జూపుమనివేడి రెట్లనిన.

దరువు, జంపె.

ఓపుణ్యతరులార ఓపుణ్యగిరులార । చూపరే దెలిపెదను సుతుని పోలికలూ॥ ౧॥ చందమామయు బోలు సారంగధరుడు శ్రీ। గంధవృక్షములార గానరే సుతునీ॥ ౨॥ కమ్మనీ తెమ్మరలు గళము శంఖమువాడు । కొమ్మవృక్షములార కొడుకునుగనరే॥ ౩॥ శిరమునను మృదువైన శిఖవాడుసంపెంగ । తరులార జూచితిర తనయునీ మీరు॥ ౪॥ సజ్జనుడు కస్తూరి సన్నతిలకమువాడు ఖర్జూరతరులార గంటిరే సుతుని॥ ౫॥ వన్నెగల మొలదట్టి చిన్నారిగొడుకును । పొన్నవృక్షము లార పొడజూచినారా॥ ౬॥ కోరికతోనే గన్నకొడుకునీ కోనలో । మారేడుతరులార మాకుజూపారే॥ ౭॥ బలువైన ఆజాను బాహువులు లవాడు । కలహంసతతులార గంటిరేసుతుని। ౮॥ సరసంపు వచన లు నెఱతీవిగలవాడు హారివ్యాఘ్రికగులార అరసితిరమీరు॥ ౯॥ చియుండిన దెలుపు సుతునిచ్చివటుమీరు । పసివాడెజంబూక పనస రా॥ ౧౦॥ స్థిరముగను వేదాద్రి మురవైరిభక్తుండు । కురువింద కొడుకునరసితిరా॥ ౧౧॥

వ. ఆ రాజనరేంద్రుండు ♦ రత్నాంగిదేవి
వారిగ వర్గంగనుజేరి ♦ అందందుసుతుని,
త్రి అలసటజెంది ♦ వేసారి ప్రాణముల్
వయత్నించిరంతనా ♦ విపినమందు,

వ. ఇత్తెరంగున తెంపుతో ప్రాణంబు వదలింపనున్న దంపతులంగని ఆ వాణి యిట్లనియె.



ఆకాశవాణి - ద్విపద.

ఓరాజశేఖరా వనితయునీవు - యీారామమునప్రాణ మిం॥ నేల - మునుపెందుబోగొ నీమోహతాపంబు - వెనుక చింతిం॥ లుంగలరే - తనయునిశిక్షించి తల్లడింపెదవు-మునినాథుశగు ॥ చంద్రునొద్ద - జీవించియున్నాడు చింతచాలించి - భూవా॥ బొమ్మువేవేగ - పరమేశు కృపచేత పాదహ ॥ ॥ - పరిశ॥ యీాపక్షమాంతమున - ఆటుమీాద మునికరుణ అంది॥ కున పురిజేరు ధరణినాథా. ॥చు తల

వ. ఇట్లు సమ్మతి వచనములచే ఆకాశవాణి సతిపతుల దుఃఖంబు - జేసి పురమునకు బొమ్మనిన సకల పరివారంబులు జేరిరంత.

## ము ని క థ.

సీ. సిద్ధుడంతటలేచి - శివపూజగావించి, సారంగధరునియా - సమున మందు । రోయకచంకను - రూఢిగనిడుకుని, గొనిపోయి చంగల్వ - కొలనులోన । జలకంబులాడించి - చిత్రాసనంబుపై, గూర్చుండ బెట్టి స - ద్గురునిదలచి - విభూతిచేనెత్తి - యీశ్వర మంత్రంబు, పఠియించి బాలుని - నిటలమందు । బెట్టి మంత్రోదకం - బిచ్చి బెత్తమునను । దట్టిసిరమునుంచి - దనసభోభాగ । మునకు ద్రిప్పుచు ముమ్మారు - మునినరుండు । జపము గావించె దనమంత్ర - వృప ముచేత.

వ. ఇట్లు మంత్రోచ్చారణ గావించి విభూతిజలంబు హృదయంబున ప్రవే శింపఁజేసి నంతమాత్రంబున.

సీ. అంతలోచిగిరించె - హస్తపాదంబులు, పాలుపార మోదుగల్ - బూచి నట్లు - దనమంత్రశక్తిచే - గనిపించె వేళ్లెల్ల, మునుపున్నరీతి న - ముద్దముతోడ । తొలినాడు దోచెను - తెల్ల తెల్లగను గోళ్లు, నక్ష త్రములవలె - నంతకంత । మరునాడు చూపట్టె - మరి కొంతకరపాద, ములు హెచ్చెనింతకు - మృదువుగాను । దినదిన మభివృద్ధి - జెందె పక్షమునకు । సరిదీరెమునుపున్న - చందానకాళ్లు ॥ కరములు నిండె ముని - కరుణాధరపైని । పారాడసాగెను । పసి బాలురతి.

గీ. అదిమొదలు మునినాథు - డత్యంత ప్రీతి
తనవెంట ద్రిప్పుచు - తపసులందరిని,
గనుగొని నాశిష్య - గణముటరనచు
చూపట్టెవనగుహా - చోద్యంబులెల్ల.

యా ల లు.

రారాబాలనాదువెంట చారాబోయివిపినామెల్ల॥ కూరిమితోజూ చివచ్చేము ॥ ఓసారంగధరా ॥ కోరినఫలమూలు దెచ్చేమూ ॥ ౧ ॥

పొన్నా పొగడ జాజిమల్లె సన్నాని గొజ్జంగులవిగో । పున్నతముగ పునీవూజింప ॥ ఓసారంగధరా॥ క్రన్నన గోయుద మిటురారా॥ ౨॥

కదలీపనసనారికేళ ఖర్జూరఫలమూలు యివిగో । ఒదగిభక్తిచేగొని పోవలయూర॥ ఓసారంగధరా॥ మదనహరు కర్చించెదనూర॥ 3॥

కొలనూలవిగో జలముదేరా వెలయునీకమండలముతో । చలగి భవునా కభిషేకి యజాయ॥ ఓసారంగధర॥ యిలను నీ ఫలభాగ్య మేమందూ॥ ౪॥

బాలారారా వేళామించె రేలజమ్మి మారేడు పత్రి । వాలాయ ముగా గోయబోవలెనూ॥ ఓసారంగధర॥ ఫాలనేత్రుని పూజా చాయనూ॥ ౫॥

వ. ఇట్లు ఫలపుష్ప పత్రి జలంబుల తన గుహకుం గొనివచ్చి శివపూజా క్రమంబున సద్గురు మూర్తియగు సదాశివు నర్చించి శేషించిన జల పుష్పపత్రి ఫలంబుల శిష్యభావంబున సారంగధరున కొసంగి అణి మాదిగాగల అష్టసిద్ధులను మందు మంత్ర క్రియ మార్గంబున నొక్క ముహూర్తంబున నుపదేశించి సారంగసిద్ధుండవని నామంబిడి తన శిష్యగణంబులలో శ్రేష్ఠంబుగా నుంచుకుని నొక్కనాడు మునివరుండు రాజకుమారునకు యిట్లనియె.

ము-క. బాలకనీ తలిదండ్రులు
చాలా చింతించినారు - జరిగిరి అయయో,
యీలాగు నుండ తగవు నీ
వేలాగునైన పురము - కేగుము పుత్రా.

సా - దరువు, యదుకులకాంభోధి - ఆట.

శరణుశరణు మునికులేంద్ర పరమపురుష గురువరాయ॥ వేడితీ॥ ...ముకొనియాడితీ॥ అనుపల్లవి॥ జననిజనకులనొల్ల మీపద శేవ జేయుచు ...ల్లకాలముండెదా॥ మీకడ॥ నుండెదా॥ ౨॥ శరణు॥ తల్లిదండ్రులు త్రబాంధవులెల్ల మీరె కల్లగాదు మునివరా॥ నన్నెగబ్రోవరా॥

## చిత్రాంగినాటకము

శరణు॥ 3॥ యిలను సంసారముల కృత్యము యింద్రజాలం బనగబుధులు వింటినీ॥ మీకృపగంటినీ॥ శరణు॥ ౪॥ అరయసిద్ధోషుండనయితినీ అయ్యదురితము లెల్లమీకడ తొలగెనూ॥ ముక్తికలిగెనూ॥ శరణు॥ ౫॥ తాపసేంద్ర మిమ్ముబాసి పావకుల చారంగ బొమ్మన ఒప్పెనా॥ కరుణా దప్పెనా శరణు॥ ౬॥ అయ్యమీకేమి యెగ్గుజేసితి చయ్యనను విడనాడ మీకు ధర్మమా॥ యిదినాఖర్మమా॥ శ॥ ౭॥ నిన్ను విడువను యెన్నటికినే కన్నవారిని చానినామనసొప్పదూ॥ యేమనిజెప్పుదూ॥ శరణు॥ ౮॥ గురువరేణ్య వేదశైల హారిసిభక్తులు మీకు జెప్పనోపనూ॥ యేమని దాపనూ॥ శరణు॥ ౯॥

### ముని - కందార్థము.

చింతించపటుమిశిఘ్రమె, సంతోష మొందజేరు సరగున తలిదం డ్రంతయు యీవిపినంబున, యెంతెంతో ఘోరమంది యరిగిరిబాల॥ మీ తలిదండ్రి॥ చేరు మీవేళ॥ సంతోష మిడన్ప్రొక్కి సరగుణ గురువాక్య మెంతానియెంచకు ఆరోగ్యనిసుగన్నవారు॥ అరిగిరిబాలా॥ మీతలిదండ్రి- చేరుమీవేళా॥

### సా - కందార్థము.

గురువర మీపాదంబులు, నెరనమ్మిన వానివిడువ న్యాయమనీకుఁ- దరిజేర్చ దాతవైతివి, కరుణామృతరసముతోడ॥ గావుము దేవా॥ మనవినిబోధివు । మహానుభావా॥ వరగుణసాంద్రమీ వద్దనుండెదగాని, పురముజారమనసు పుట్టాదుమునిచంద్ర॥ గావుముదేవ॥ మనవినిబోధివు - మహానుభావా॥

### ముని - కందార్థము,

తలిదండ్రులు దుఃఖమందిన, కిలకాలము పుత్రునకును గలుగును దుఃఖం - బనిబుధులుజెప్ప వినవా, చనివ్యసనము మాన్పిరారా॥ సారంగధారా॥ నినుగన్నవారి । చారంగబోరా । వలనొప్పమీవారు

వచ్చి శోకించిరి. పలుభాషలేలను పరమేశు సాక్షిగ ॥ సారంగధరా నినుగన్నవారి - చారంగబోరా ॥



సా - కందార్థము.

ఎక్కడ తలిదండ్రులు సఖు, లెక్కడి బంధుకోటి యెవరికివారే - వెక్కరుకారని వెంటను, నిక్కంబుగ పాదశేవ ॥ నెరనమ్మినాడ ॥ ధర్మ మతహో ॥ నాథవిడనాడ ॥ చిక్కి సంసారమున చిడిముడి బడనోప, దిక్కు మీరెనాకు దీనూడ రక్షించు ॥ నెనమ్మినాడ ॥ ధర్మమ తహో - నాథ విడనాడ ॥

ముని ద్విపద.

వినురాజనందన వినుమొక్కమాట - తనయులెవ్వారో తల్లి దండ్రులెవ్వారో - యిలలోన సతిసుతులు యింద్రజాలంబు - కలవంటి సంసార కారణం బనుచు - నమ్మియుండిన వారు నరకంబుజెంది - యిమ్మహి జనులంత యీషణత్రయముల - తొలగింపలేక దుర్దోషులై యెపుడు విలపించుచున్నారు యింతియేకాక - నినుగన్న మమతచే నీతల్లిదండ్రి

పసుదుఃఖమునందున మునిగియున్నారు - మాత పితశోకంబు మాన్పి రాకున్న నీతపోఫలసిద్ధి నెరవేరబోదు - నీ వారిపై ప్రేమ నాకుండగాను పోవేమి పలుమారు బోధింపవలెను - గురువాక్యమునుమీర - గూడ దెప్పటికి - సరగునపురిజేరి సంతోషపరచి - గలబంధుమిత్రుల గనవారి చేత - శలవొందిననుజార శీఘ్రంబెరమ్ము.

వ. ఇట్లు సమ్మతిపరచిన మునిచంద్రునకు సాష్టాంగ దండ ప్రమాణంబు లాచరించి.

సా - ద్విపద.

శ్రీమించు సారంగ సిద్ధుడావేళ - ప్రేమాతిశయమున పెంపు దీపింప - కరమున బెత్తంబు ఘనకమండలము - సరగుణ రుద్రాక్షశరులు యురమందు - ధరియించి పులితోలు నండంబుబూని - గురుపాదముల శేవ గురునిల్పినంత - కాషాయవస్త్రముల్ గట్టివిభూతి - వేషధారుండై యోగవాహనము - యెక్కిపరమేశ్వర యని దలచివేగ గ్రక్కున నరపతి గడజేరుమనియె.

దరువు, మధ్యమావతి - ఆట.

యోగవాహనుడై వెడలెనపుడు ॥సారంగసిద్ధుడు॥ యోగవాహనుడై వెడలెనపుడు ॥అనుపల్లవి॥ రాగములను విరాగమొందియిల। భోగములన్నియు త్యాగముజేసుక ॥ యో ॥ సంచీత ప్రారబ్ధములద్రుంచి॥ గురుశేవమదిలో ॥నుంచీ పూరామును కుంభించి॥ అంచితముగ - సిద్ధాసన భేరివేయ ॥వింతాగ కిన్నరలు కింపురుషులు నాట్యముచాయ॥ విరులవరష ములు కురియగ మరిమరి। సురులద్భుతమై చూడగయంతో ॥ యో ॥ పులితోలువస్త్ర మమరగట్టి సారంగసిద్ధు ॥ డెలమి దండంబుచేతబట్టి ॥ కలుషరహితుడై దరలెనువేద। శైలవిహారుని చింతింపుచుతా ॥ యోగ వాహనుడై వెడలెనపుడూ ॥

ఇట్లు సారంగసిద్ధుండు తన యోగమాహాత్మ్యంబుచే క్షణమాత్రం
బున నరపతి పట్టణంబు చేరగ.

పురజన లాశ్చర్యంబున, పరువడి రత్నాంగిదేవి ♦ పతికెరిగింపగ,
అరు దెంచిబిడ్డ నెత్తుక, మురయుచుతోడపై నసడుక ♦ ముద్దులుకొనియెగా.

ఇట్లు రాజేంద్రుండు రత్నాంగిదేవి పుత్రుని గౌగలించుకొని చెక్కిలి
నొక్కి ముద్దాడి యిట్లనియె.

రాజు - ద్విపద.

ఓపుత్రరత్నమా ఓసత్యసుగుణ - నేపాపకారుడై నెడబాసినిన్ను -
గాడగంటినిపూర్వసుకృతమువల్ల - యీ దేరెమాకష్టమింతియెకాక - నే
యునపకార మెంచకెల్లపురి - పూజింపదగురాజ్యపదవిచెన్నొందు - సకల
సౌఖ్యంబుల సతిసుతులబడసి - సుఖమొందగను విమ్ముమాడభాగ్యంబు.
పుత్ర నినుశిక్షించి భూలోకమందు - శత్రుడని అపకీర్తి జెందితినకటా.

సా-క. తప్పులుగలవారలను ఒప్పుగ శిక్షించపుడమి ♦ వల్లభులకును,
యెప్పుడు జెల్లునుసుతుడని, తప్పునుమన్నించ రాజ-ధర్మముజగతిగా.

సా - ద్విపద.

వినవయ్యభూపాల విన్నవించెదను - పినతల్లి చిత్రాంగి ప్రియభాష
వల్ల మును జేయుదుష్కర్మములుయల్లవిడి - ఘనయోగసాంమ్రాజ్యపదవి
నాకందె-రాజ్యంబు నాకేల రమణిసుతులేల పూజింపదగు భోగభాగ్యంబు
లేల - ధనము పుత్రులుభార్య దనవారలనుచు - మనము సుఖపొంగుట
మమతలేకాని - సుతులుసతులమాయ సుఖదుఃఖములుమాయ - బ్రతుకు
దబ్బరలాయ భ్రాంతివిడదాయ - కలవంటికలిమాయ ఖర్మమిడదాయ -
వలదుజిక్కిన లేడివలె తపంచకను - సంసారబంధంబు సన్యసించితిని-హింస
నొందగలేనువిను మొక్కమాట - మిమ్ముజూచి గమ్మనుచు మీనానాథుండు-
మముదోలెనిందాక మరియుమీ రెల్ల - క్షేమమా పురజనులు క్షేమమా
బుధులు - క్షేమమా నేడు నీచెలియుచిత్రాంగి - భూవరననుజూడ పాలతి
రాదాయె - పోవ లెశివపూజ ప్రొద్దాయెమాకు.

వ. ఇట్లు బలికిన కుమారునకు రాజేంద్రుం డిట్లనియె.

# చిత్రాంగినాటకము

రాజు - క. పుత్రుని మోహించు దుష్టుల
ధాత్రిని వుంచంగరాజ ♦ ధర్మంబగునా,
శత్రువు రాలని వేగమే
చిత్రాంగిని శిక్షించినాను ♦ శీఘ్రములోనన్.

సా-క. హరహర స్త్రీహత్యజాయను
నరవర యెటుదోచెనీకు ♦ న్యాయంబనుచున్,
సరగున చిత్రాంగిగతము
పరికించిన గురుడాజ్ఞ కొలది ♦ బ్రతికించెదను.

వ. ఓ రాజనరేంద్రభూపాల శిశుహత్య స్త్రీహత్య పశుహత్య లివి మహాపాపహేతువులుగాన చిత్రాంగి మృతంబైన చోటుజూపించిన పునర్జీవిగాజేసి మీకు అప్పగించెదనని వేషిన నచ్చోటుగనిపించె నంత సారంగసిద్ధుండు మనంబున గురుస్మరణాగావించి మంత్రజలంబుప్రోక్షించి విభూతివైచి శ్రీమన్నారాయణ మూర్తియగు శ్రీవేదశైల లక్ష్మీవల్లభుని స్తుతించె నెట్లనిన.

సా - సుగంధవృత్తము.

శ్రీరమేశపద్మనాభ శేషశయనగిరిధరా। కూ్రరదనుజ మర్ధనాఖ్య కోటిమన్మథాకార। రారభక్తవరదశౌరి రామకృష్ణశ్రీధరా॥ పాహివేద శైలవాస పరమపురుష శ్రీహరే॥ అనుపల్లవి॥ దాసపోషశంఖచక్రధార గరుడవాహన। భాస్కరుడవు జగముకెల్ల భవ్యరూపధారణ। వాసుదేవ రార కరివరద జగన్మోహన। పాహివేద శైలవాస పరమపురుష శ్రీహరే॥ అచ్యుతాముకుంద క్షీరాబ్ధిశయన బోవరా। స్వచ్ఛమైన ప్రత్యగాత్మ సాక్షినీవెమాధవా। మత్స్యరూపవిధికి వేదమిచ్చి వేగకావరా। పాహి వేదశైలవాస పరమపురుష శ్రీహరే.

వ. ఇవ్విధంబున శ్రీమన్నారాయణమూర్తిని కొనియాడి తనయోగ బెత్తంబుచే నచ్చోట దాకించి నంత మాత్రమున.

క. జనులద్భుతి మందినూడగ
మునిపుత్రుడు భూతితీర్థ ♦ మునుప్రోక్షింపన్,
వనితయు దిగ్గునలేచి
వినయంబున రాజసుతున ♦ కిట్లనిపలికెన్.

చి-క. అపకారని నన్ను యెంచక
వుపకారము జాయనీకు ♦ వొప్పెనుతండ్రీ,
చపలాక్షిని నాదు నేరము
విపరీతం బనకమదిని ♦ విడువుము పుత్రా.

అని పలికిన సారంగధరునకు ప్రదక్షిణంబొనర్చి దండప్రణామంబులాచరించి నిలువంబడియున్న చిత్రాంగిహస్తంబుపట్టి యేతండ్రి నాయందు మాపినతల్లి జేయుదుష్కృతంబేమియుమదినెంచక దేవిగాగైకొమ్మని ప్రార్థించిన రాజనరేంద్ర భూపాలుండు సమ్మతించి పుత్రునియొక్క ప్రభానంబుకొనియాడి రాజేంద్రుడు యిట్లనియె.

సంవాదము - దరువు, నాదనామక్రియ - అట.

ఏరాకుమార || యియ్యెడరాజ్య || మేలుకోవేరా|| అను || వారకమముజార ఒచ్చిపోవగనేల | కోరికలుప్పొంగ కొడుకనిన్నుజూడ ||ఏ||

పదవినాకేలా || గురుకులవాస || మొదలభూపాలా || మదమత్సరములీడి మహనియ్యులగుబుధుల | వదలనినితాపసి వరులాకుయూతుచ్ఛ్య|| పదవినాకేల ||

గతినీవేయనుచూ ||నమ్మితిరాజ్య || పతివయ్యేదవనుచూ || సతతామునీకెన్ని సామ్యములు గడపిన| మతినుంచకనుయెతుల మరిగివిహరించుట || యేరాకుమార ||

తండ్రి వినయ్యా || తపసులవిడచి || నుండలేనయ్యా || వండీగ వేదాద్రి ధాముడవు శ్రీహరి | అండజేరినభక్తులయితిమి యిఖరాజ్య || పదవిమాకేల|| గురుకులవాస|| మొదలభూపాలా||

రాజు - కందార్థము.

కురుపావనపుత్రనీవు, కలిగిన సంతోషమయ్యె ♦ కడుశీఘ్రంబె, యిలపాలన విడుతునీకును, చెలువొప్పగ రాజ్యపదవి || చేకొనదేరా ||
జనకుని యాజ్ఞ జవదాటకూరా|| తలిదండ్రులకు సేవ తగసల్పిఅటుమీద | కలనొప్పగురుకూల వాసాము బోవలె | చేకోవదేరా ||జనకునియాజ్ఞ ||

సా - కందార్థము.

నరనాథ తల్లిదండ్రుల, సురచిరముగ బంధుకోటి ♦ జూచియురమ్మని డిటు బంపగవస్తిని, ధరపాలన జాయతపో ; ధనులా కేమిటికి ||

ధన్యుడనైతి తండ్రియిప్పటికి॥ మరుగేలయిదితుచ్ఛ శ్రీ మమతభోగము నొల్ల। పరమపురుషుల శేవ పాటించిన తపో॥ధనుల కేమిటికి॥ ధన్యుడనైతి॥

వ. ఇవ్విధంబున బలుకుచున్న కుమారునకు తన శక్తికొలది బోధించిన వినకున్న రాజనరేంద్రభూపాలుండు రత్నాంగిదేవితో యిట్లనియె.

రా-క. వినవే రత్నాంగిమన. తనయుని కెన్ని దెలుప ♦ తగదని రాజ్యము, ముని శేవకుపోవదల చెను, జనవలదని పోయినిలుపు♦చయ్యనవానిన్

వ. సారంగధరుడు తండ్రిమాటలకు సమ్మతించకయున్న తల్లియగు రత్నాంగి పుత్రుని కౌగలించుకొని చెక్కిలి నొక్కి ముద్దాడి ప్రియ వచనములచె యిట్లనియె.

సంవాదము - దరువు, కాంభోజి - అట.

తనయ రాజ్యపదవి చేకోరా। నాముద్దుకొడక ॥ ఘనత కెక్కిన కీర్తిజెందరా ॥
జనని యింత చింతయేలనే ఓతల్లి తపో। ధన్యుడనైతి రాజ్యమొల్లనే॥ ౨॥
కన్నతండ్రి ఆజ్ఞమీరకు। నినునమ్మియున్న చిన్నికొడుకమునుల జేరక ॥3॥
హారహారసురవరుసీసాటిగ ॥ ఓకన్నతల్లి । గురునివదలియుండ లేనుగా ॥౪॥
సిరులుసంపదలరయ రాజ్యము । నాచిన్నికొడుక । యొరులపాలుజాయ జాలము ॥౫॥
తనువుధనము శాశ్వతంబకే ఓకన్నతల్లి మనము నెంచమాయగాదకే ॥౬॥
సతులసుతుల బడసియుండగ । మినుకనులజూడ । గతులుమాకు లేక పోయెగా ॥౭॥
తల్లి వెసనమంద నేలనూ । వేదాద్రిలక్ష్మి వల్లభూనివిడువజాలనూ ॥౮॥

ర-గీ. నెలమితోనేపది ♦ నెలలుగర్భమున
మోసీగనిపెంచితి ♦ ముద్దుతనయ.
యెదుటనుండినచాలు ♦ యెతుల శేవించను
జరుగవలదు వినుము ♦ జననిమాట.

సా-గీ. కన్నవారలు మీరమది ♦ కాంతిలూర
నన్ను దీవించి పంపు ♦ మునినాధుకడకు,
పోయెదశివపూజ ♦ ప్రొద్దుగావచ్చె
యుని జప్పగనేల ♦ కన్నతల్లి.

వ. ఓజననీ యిన్ని తెరంగుల బలుక నేల సంసారతాపత్రయంబుల నన్యసించి మహాత్ముల పాదారవిందంబుల నమ్మి సిద్ధుండనయితిగాన యిత్యాది పురంబులం దందు క్షణమాత్రంబయిన నిలువమాకు

వే! మీ శెలవొసగి బంపుమాతల్లి కల్పవల్లి.

ఉత్రమ్మ శ్లోకాలు - పోవాడినీవు, విపినసంచారుడై - వేగదల యుముజూడరావలయు-మరువకపుడపుడు, బ్రతికినన్నాళ్ళు

ఖుమిఖ - బ్రతుకగలమా.

వ. ఇవ్విధంబున బలికిన జననిజనకులు పుత్రుని దీవించి చెక్కిలి నొక్కి ముద్దాడి శెలవొసగి బంపెనంత,

సా-గీ. సారంగధరుడంత - జననినాశ్రమునకేగి గురుపాద-ముల కొరగి మ్రొక్కి, తనవారి క్షేమంబు - తగవిన్నవింప. సిద్ధుడంతట సంతోష - స్థిరమునొందె.




వ. ఇట్లు సారంగధరుడు గురునాధుచెంతజేరి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి తలిదండ్రుల చిత్రాంగి క్షేమంబులెల్ల దెల్పి వారి సన్మానం బును బడసి నచ్చోట సిద్ధుడై నిలచెనంత.

వ. తదనంతరంబు పుత్రునిదలంచి చిత్రాంగియెదుట చిత్రాంగి యిట్లనియె.

-గీ. గోమున నేగన్న - కొడుకునీవాత, బెట్టి నేటికసుతుని పెం - పాక గంటి, చెలియ యెంతటికైన - చెల్లుదువేనీవు, బాలకులకు బాల-గ్రహామె నా చవలి.

## చిత్రాంగి నాటకము

దమి గ. పణతిరో చవతియని - పలుమారుపైకి, ద్రోమ్మిచే దృమికేదవు
గాద దొరసానివటవే, యెంతకుండిన నోరు - విచ్చిమాట్లాడెదవు చవితి
లేకన్నుసన్న!- గించితివె యబలా.

సంవాదము - చవతులకొట్లాట.

ర॥ మదవతినేనన్నా మాటలకు చిత్రాంగి। యెదిరించిపలుక నీవెవతివే॥
చి॥ యెదిరించకానేమి సుదతిరో నీవుబల్ । అధికురాలననుకున్నావటే॥
ర॥ యెక్కువగాకాను తక్కువయ్యేదనటే! కుక్కవలెను గూయకుండవే॥
చి॥ రోచినదాననే కూసేకుక్కనాటె । పూచిపోయ్యేరుమూతిదాచుకోవె॥
ర॥ అసు భామినివలె యసుయ మిస్రుమికేవు । మసిబూసినేరేసు లమ్మకే॥
చి॥ నీకంటె అసురాలు లోకంబులో లేవు । ఓకిలికి నీవిట్లు వదరకే॥
ర॥ చిన్న పెద్దలుగాక కిన్నెరోనిను నేను । అన్న మాటకు బదులాడెదవా॥
చి॥ ఆడకేమియెంత అధికురాలవాని । చేడెనీ చెయికింద లొగ్గెనా॥
ర॥ చెప్పుపన్న కుక్క చెరకుతీపెరుగునే । గొప్పకొద్ది తెలుసుకొనజాలవే॥
చి॥ పాలతిరొనీగొప్ప తెలిసిపోయెనుయిపుడు గలగాలఅరువాకెగాడిదే॥
ర॥ యెంతకోర్చుకున్న పంతంబులాడేవు । యింతనీచెంపాలు వ్రేతునే॥
చి॥ వ్రేయకుండినపరువు నీకింతు సభలోన మాయలాడినోరుమూయవే।
ర॥ భూతాముపలెవచ్చి నాతిరొనాసుతుని । వాతబెట్టుకనిట్లు వదరాకే॥
చి॥ గరితారొనావల్ల వసుతుకువేదాస్త్రి । హరిపూజప్రాప్తంబుఆయెగదే॥
వ.ఇట్లు కలహించుచున్న సతులగావించి రాజనరేంద్ర భూపాలుండిట్లనియె.





# చిత్రాంగినాటకము

రా-గీ. సఖియలారమీరు ♦ సవతులిద్దరును
కలహ మొనరింపతగు నె ♦ నిష్కారణముగ,
పరులజూచిన మనకిది ♦ పరువుయగు నె
చేడెలారమీకొకరు ♦ జెప్పవలెనా.

వ. ఇట్లు బలికిన రాజనరేంద్రభూపాలుండు యిరువురిసతుల సమ్మతిపరచి సుఖంబున రాజ్యమేలుచునుండె.

## గొబ్బిపాట.

గొబ్బియ్యళ్లో గొబ్బివేపశైలవాసగొబ్బి శ్రీనివాస। గొబ్బియ్యళ్లో॥ అనుపల్లవి॥ వాసుదేవ పద్మనాభ వరద జగన్మోహన । గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో దాసపోషశంకుచక్రధారగరుడవాహన । గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో గిరిధరాబ్ధిశయన ఘోరదురితహరణమాధవా । గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో పరమపురుష లక్ష్మిరమణ మురహరిముకుందా॥ గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో ఆది మధ్యాంత రహిత అసురమర్ధనశౌరి॥ గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో వేదవేద్యాపరమానందరాధారమణ శ్రీహరే॥ గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో వైకుంఠనివాస కరివరద వేణుగాన॥ గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో గోవుల పరిపాలనకృష్ణ గోవిందచ్యుతా॥ గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో స్థిరముగ వేదాద్రినరహరి శ్రీదామోధర॥ గొబ్బియ్యళ్లో॥ గొబ్బియ్యళ్లో ధరనుకాలంశెట్టి గురుదాస కవిపోషా॥ గొబ్బియ్యళ్లో॥

## మేలుకొలుపులు - భూపాళరాగము.

మేలుకో వేదాద్రి మేటినారశింహ్వా। మేలుకొనిగమాంత మేలుకో మేలుకో శ్రీలక్ష్మినాదపరాత్పర మేలుకో తెల్లవారె మేలుకో॥ అనుపల్లవి॥ సురులుమునులు వచ్చి పరిపారివిధముల ప్రస్తుతిజేసెదరు మేలుకో॥ పరమపురుష యొతుల కభయమొసంగను పక్షివాహనదేవ మేలుకో॥ మేలుకో॥ మురహరిహారతి అరుంధతిదెచ్చేను ముందుగ ముసుకీడి మేలుకో॥ చిరుతర లక్ష్మిని గూడుక భక్తులతో బలుకకుండుట మేలుకో॥ మేలుకో॥ శ్రీ శాయన అత్రియనసూయ ఒచ్చేను చెప్పశక్యముగాదు మేలుకో॥ పాహాస్తునిపత్ని శ్యామలమహాదేవి పన్నీరుదెచ్చెను మేలుకో॥ మేలుకో శార్వాణిగంధంబు గీర్వాణికస్తూరి ఛత్రచామర మొచ్చె మేలుకో॥ నిశ్వా.

# చిత్రాంగినాటకము

లేచిరి భక్తులు నీలమేఘశ్యామ మేలుకో॥ మేలుకో॥ సనకసనా దివు ; ...చ్చక లొచ్చేటి సమయామునగావచ్చె మేలుకో॥ దినకరశరనేత్ర ...హాలాది భీషణులు దివ్యాంబరములుదెచ్చె మేలుకో॥ మేలుకో॥ వశిష్ట ...ల్మీకులొచ్చి వాకిటనిలచే వరహావతారూడ మేలుకో॥ పసిదూడలా ...చి పణతులందరులేచి పాల్ బితికె వేళాయె మేలుకో॥ మేలుకో॥ కిన్నర ...ధర్వకింపురుష దేవాంతగణమూలువొచ్చిరి మేలుకో। పొన్నపొగడజాజి ...ంగిమల్లెలా పొసగపూజించెదరు మేలుకో॥ మేలుకో॥ తెల్లవారెనువీధి ...నులు మిక్కటమాయె ఎల్లతారలుమాశె మేలుకో। కొల్లగ పక్షులు చలరేగిభానుండు వుదయపర్వతమెక్కె మేలుకో॥ మేలుకో॥ రంగైన నెల్లూరి రాజయోగి తిరుమలార్యశిష్యుడు వొచ్చె మేలుకో। పొందుచు గురుదాసు పరమభక్తుని మొర పాలించిముక్తియ్య మేలుకో॥ మేలుకో॥

మంగళహారతి.

హారతీ। మంగళహారతీ। వైకుంఠవాస॥ హారతీ। మంగళహారతి॥ అనుపల్లవి॥ హారతిదిగో కోటిమన్మధకార కరుణాపారశౌరి। ఘోర దనుజుల వైరిహరి క్షీరాబ్ధిశయనా నీకుకర్పూర హారతి॥ మంగళహారతి. నందనందముకుంద రమానందప్రియ గోవిందభక్తా। చందనాచ్యుతనాగ దాది మునీంద్రవందిత యిదిగో కుంభా। హారతి॥ మంగళహారతి॥ వాసుదేవ శేషశయన దోషహార నిగమాద్రియందు। వాసమై నెలకొన్న భక్తా వరద శ్రీహరినీకు కర్పూరహారతి॥ మంగళహారతి॥ అట్టిదేవపట్టివై నీవుపుట్టి ఖలులను ద్రుంచి కాలంశెట్టి। గురుదాసాఖ్యకవిచే పట్టిబ్రోచిలక్ష్మీరమణా॥ హారతి। మంగళహారతీ॥ వైకుంఠవాస హారతి। మంగళహారతీ॥

ఇయ్యది,

సింహపురంబను - నెల్లూరు నివాసుండునగు

కాలంశెట్టి - గురువయ్యగారిచే

రచియింపఁబడిన,

చిత్రాంగినాటకము - సమాప్తము.

---

# గ్రంథముల జాబితా

వేమన యోగివిరచిత వేదాంతసిద్ధాంతము, పద్యములును, ర్థ్యమును గలది. ఇందు 500 పద్యములు గలవు. వేదాంత తత్త్వము సులభముగా దెలియఁజేయును. 0. 87 న.

వేమనపద్య రహస్యార్థతాత్పర్యబోధిని ప్రథమ, ద్వితీయ సంపుటములు, పద్యములును, తాత్పర్యమును గలది. పూడి పెద్ది. సాంబశివరావు గారి విరచితము. త్వరలో తయారుకానున్నది.

వేమన జ్ఞానమార్గపద్యములు (3002) ఇందునీతి, ఆచారము, ధర్మము, వేదాంతము, మొదలగు పలువిషయముల గురించి వేమనగారిచే రచియింపఁబడి మేలైన తెల్లటి గ్లేజు దళసరి కాగితములయందు అకారాదిగా పెద్దఅక్షరములలో పాకెట్ సైజున తయారగుచున్నది. పిన్నలకు, పెద్దలకు బోధమగునట్లు సులభశైలిలో వ్రాయబడినది.

క్యాలికో బైండు అచ్చు.

వైద్య చికిత్సాసంగ్రహము.ఇందు వంట ఔషధములును, చూర్ణాదులును, చటకాలును, లేహ్యములును, భస్మాదులును మొదలుగాఁగల 15 ప్రకరణములుగలది. అనుభవములోనిది. రూ. 1 00

విచారజ్ఞానకీర్తనలు 0.37

పరిపూర్ణతత్త్వ ప్రకాశిక 0.31

వేదాంత ప్రశ్నోత్తర ముక్తావళిఅనెడి

గురుశిష్య సంవాదము 0.37

శ్రీమద్వాల్మీకి రామాయణం మూలం, రఫ్ 3.50

శ్రీపోతులూరి వీరబ్రహ్మంగారి నాటకము శుద్ధప్రత

బ్రహ్మంగారు సిద్ధునకు ఉపదేశించిన బింబమును కలదు. రూ. 1.25 నపై.

వాసుదేవమననము 0.37

అచల ప్రబోధయను శుద్ధనిర్గుణతత్త్వ

జంట కందార్థదరువులు 0.37

ఆత్మానాత్మ వివేకము 0.12

